MADRAS

# బిస్మిల్లా హిఱ్ఱహ్మా నిఱ్ఱహీమ్.

కడపపట్టణ కాపరస్థుడగు హెచ్. యస్. ఏ. యం.
మంజూమియ్యాసాహేబుగారిచే వ్రాయబడిన

## పంచనిబంధనగ్రంధము

## (Five fundmental doctrines of Islam in Telugu)

ఇది

మహమ్మదీయుల మతగ్రంధములలోనుంచి తెలిగింపబడి
పండితులచే పరిష్కరింపబడి

కడప కల్యాణకుమార విలాసముద్రాక్షరశాలయందు
మానేజరు
దూబగుంట శ్రీహరిరావుగారిచే
1893 సం॥ ఆగష్టునెలలో
ముద్రింపంబడి ప్రకటింపబడినది.

All Rights Reserved.

*In the name of God Almighty, the most gracious and most merciful.*

Heaven's Choicest blessings on His Blessed Prophet Muhammad and on his companions and posterity.

It has been an old and well known maxim of Islam that "the people imitate their rulers" and it is also one of its enjoined duties that the people should always be loyal and grateful to and sympathizing with their sovereign for the time being. What other proof is required to prove the inert soundness of the teaching of Islam? It has been the general practice of all the great Moslem authors (God's mercy on them) to commemorate the virtues of the sovereigns of their time and to guide themselves on having flourished during their age. As compared with those great and learned men, I am but a feeble imitator, but nevertheless I will follow their example. I have been born and bred up and have been favored with also several honorary appointments during the reign of Her august Majesty the Queen Empress of India, Kaisari-Hind, and it is my fervent prayer that God Almighty protect her and her family and her crown for ever.

Then, the Governor of the Presidency His Excellency Lord Wenlock is so kind and sympathizing with the people over whom he rules that he treats all alike, and his beneficence extends to all without exception.

And the ruler of the District, Mr. O. Wolfe-Murray, is such an able officer that he has equalized all the different caste-people. He well appreciates the efforts of any person who works for the public-good and gives him his valuable advice.

This treatise has been written in Telugu as that Language is spoken in a great portion of the Madras Presidency. I have not denounced herein any of the several Religions and have confined myself simply to expound the five fundamental ordinances of Islam, viz, the confession of the creed, the performance of prayers, the observing of the fast, the payment of legal alms and the performance of the Pilgrimage to Mecca. It is requested that all who know Telugu may be pleased to read this little book and remember me and my ancestors in their prayers. I have added my geneological tree at the end of the book.



From,

Syed Mustapha Hussain Sahib,
Khazi of Cuddapah.

To

H. S. A. M. Munjumeah Sahib Bahadur,

Dear Sir,

I have read with much interest from the beginning to the end your pamphlet on the Five Fundamental Doctrines of Islam written in Telugu. It is very well written and the subject it treats of has been very lucidly explained. May God Almighty for the sake of his blessed Prophet Muhammad (blessings on him for ever), grant you the recompense you deserve for the pains you have bestowed in writing it.

I say this with a feeling of pride that this is the first book of its kind written in Telugu at least in this District. I believe the fact that Telugu, is the vernacular of the District and is read and spoken of by a majority of the Mussalmans, not only here, but also in other Districts, has induced you to write your pamphlet in that language No doubt Telugu speaking Mussalmans will derive great benefit from your work and people of other religions will also know some thing about the doctrines of Islamic sophiesm.

I note with pleasure that in accordance with the ancient usage of all Moslem writers, you have expressed sentiments of loyalty to our reigning sovereign,

and I am glad to see that in doing so, you have faithfully followed the first lesson of our Holy Teacher.

I conclude with the expression of this wish that as you know Telugu so well, you may write some more pamphlets on kindred subjects, so that our Moslem brothern here and elsewhere may therefrom derive much advantage and tuition.

I remain
Dear Sir,
Your Most Obedient Servant
(Signed) Mustapha Hussain,
Khazi of Cuddapah.

Cuddapah.
6-5-93.

My Dear Saheb,

Accept my thanks for the copy of your Telugu pamphlet on the fundamental doctrines of Islam, kindly sent. It is a very clear epitome and is well-calculated to give the readers a good idea of your religion.

Yours Sincerely,
(Signed) A. S. Vaidyanatha Aiyar,
Head master,
High School.

To

H. S. A. M. Manjumeah Sahib,
Cuddapah.

# బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్,

॥ విజ్ఞానదీపిక ॥

---

శ్రీప్రదండును విశేషమహాత్మ్యుడును కరుణాపయోనిధియునైన భగవంతునియొక్క నామమును నిరంతరము స్తోత్రముజేయుచు వారిచే నాశీర్వదింపబడిన గొప్పవారగు హజరత్ సయ్యదినా మహమ్మద్ గారికిని, వారిసంతతివారికిని వందనములు చేయుచు వ్రాయునది యేమనగా.—

మహమ్మదీయన్ మతస్థాపకులగు హజరత్ మహమ్మద్ గారు జనులకు తమ్మునేలుచుండు ప్రభువులయందు విశ్వాసమును, కృతజ్ఞతయునుగలిగి, యనుసరించియుండుట ప్రధానకార్యమని వక్కాణించిరి.

జనులకింతకన్న తెలుపవలసినదేమియు లేదు.

శ్రీదేవుని యనుగ్రహపాత్రులగు మహమ్మదీయన్ గ్రంథకర్తలనేకులు వారివారి కాలమందుండిన రాజులయొక్క సచ్చరిత్రములను సద్గుణంబులను కొనియాడుచు వారినడవడిక ననుసరించి వర్తింపుచుండిరి.

సకలకళావిశారదులును, నిరంతర లోకోపకార పరాయణులునగు ఆమహాత్ములకు, మందప్రజ్ఞుడనగు నేసమానుడగాను, అందరానిపండందదలచి చేతులెత్తిన పొట్టివానివలె పూర్వోక్తవిశేషచర్యలనే

ననుసరింపదలచుచున్నాను. అదియును శ్రీభగవ దనుగ్రహమువలనను పెద్దల యనుగ్రహమువలనను గలిగినదియేకాని వేరుకాదు.

ఇదిగాక ఇండియాదేశచక్రవర్తినియగు శ్రీమహారాణి (కేసరేహింద్) గారి ప్రభుత్వములో నేనుపుట్టి పెరిగి విశేష మర్యాదగల యుద్యోగములను పొందినవాడగాన నా శ్రీమహారాణి చక్రవర్తినిగారి కుటుంబమును వారిసింహాసనమును సర్వదా శుభస్థితితో నుండుటకై శ్రీదైవమును మిగుల వేడుచున్నాడను.

ఈరాజధానికి గౌనర్‌గారని ఘనతవహించిన లార్డ్ వెన్‌లాక్ జి. సి. ఐ. ఇ. ప్రభువులవారు ప్రజ్జలకడదయయును, సంతోషమును, పరోపకారభావమును, కలిగి యందరిని సమదృష్టితో పరిపాలన చేయుచున్నారు. గానవారికి నిరంతరము శుభస్థితి కలుగునటుల శ్రీదేవుని ప్రార్థించెదను.

ఈజిల్లాప్రభువులగు మేస్తర్ ఓ. ఉల్ఫ్‌మట్టి దొరగారు సర్వమతస్థులను సమానచిత్తముతో నేలుచు ప్రజాభివృద్ధికరములైన కార్యముల చేయువారియొక్క ప్రయత్నములను పరిపూర్ణములైన వాటినిగా సమ్మతించుచు అందుకుతగిన సహాయమిచ్చుచున్నారు. గాన వారికి యశః ప్రకాశము అంతకంతకు నభివృద్ధియగునటుల శ్రీదేవు నివేడెదను.

ఇప్పుడు భగవద్భక్తితో మామతసంబంధమైన యీచిన్నగ్రంథమును చేయబూనుకొని మద్రాస్ రాజధానిలో విశేషభాగమునం

దాంధ్రభాషమిగుల జనులకు వాడుకగానున్నందున ఈభాషతో వ్రాసినవాడను. ఇందులో మతసిద్ధాంతములు సంక్షేపముగా వ్రాయబడి యున్నవి. ఇస్లాం మహాత్మునియొక్క ముఖ్యములైన అయిదునిబంధనలు మాత్రమనగా.—

౧ మతోద్ధారణవిధమగు మంత్రమును పఠించుట.—(కల్మయే తయ్యబ్ పడనా)

౨ శ్రీదేవుని ప్రార్థనచేయుట. అనగా—నమాజ్

3 ఉపవాసముండుట—(రోజా)

౪ న్యాయమైనధర్మమును చేయుట.—(జకాత్)

౫ మక్కాషరీఫ్ యొక్క యాత్రచేయుట.—(హజ్)

ఇవివివరముగా నిందువ్రాసియున్నాడను. గాన తెలుగుభాష తెలిసినవారందరు నీచిన్నపుస్తకమును చదివి నిందుఏలాటి దోషము లుండినను నవి సులక్షణములైన వాటినిగా పరిశీలించుచు దయతో నీగ్రంథప్రార్థనకాలమందు నన్నును నాపెద్దలను జ్ఞాపకముంచవలసినదిగా ప్రార్థించెదను.



కడపఖాజీగారైన సయ్యద్‌ముస్తఫా
హుశేన్‌సాహేబ్‌గారి వద్దనుంచి

హెచ్. యస్. ఎ. యమ్. మంబూమియ్యాసాహేబ్,
బహదూర్‌గారికి

ప్రియమైన అయ్యా,

తమరు తెలుగుభాషతోవ్రాసిన ఇస్‌లాంగారి మూలాధారము మతసంబంధమైన పంచశాసనములుకల యొక చిన్నపుస్తకమును నేను ఆదినుంచి అంత్యమువరకు మిక్కిలి ఆనందముతో చదివితిని. అది బహుబాగుగా వ్రాయబడి అది తెలియజేయు అంశము బహునిర్మలముగా విశదీకరింపబడినది. ఈపుస్తకమును యేర్పాటుచేయువిషయమై మీచేతీసుకోబడిన ప్రయాసకుగాను శ్రీసృష్టికర్త తమ యాశీర్వాదమునకు పాత్రులైన మహాత్ములైన హజరత్ సైయ్యదినా మహమ్మద్‌గారి కటాక్షముద్వారా యెల్లప్పుడాశీర్వాదరూప ప్రతిఫలమునుమీకునొసంగుగాక.

కడపట సీడిస్ట్రిక్టులో నీమాదిరిలో తెలుగుభాషతో వ్రాయబడినదానిలో నిదే మొదటిపుస్తకమని నేను మిక్కిలి ధైర్యముతో వక్కాణించుచున్నాడను. ఈడిస్ట్రిక్టులో తెలుగుదేశభాషగానుండియీ జిల్లాలోనేమి యితరజిల్లాలలోనేమి మహమ్మదీయలు తరుచుగా చేయుచున్న యాంధ్రభాషాభ్యాసమే ఈపుస్తకమును మీరాంధ్రభాషతో రచియించునట్టి ప్రోత్సాహము కలుగచేసెనని నేను నమ్ముతాను.

ఇట్టి మీకార్యమువల్ల నిస్సందేహముగా తెలుగు భాషాభ్యాసము చేయు మహమ్మదీయులు గొప్ప ప్రయోజనమును పొందుదురు. మఱియు నితరమతావలంబులైనవారును ఇస్‌లాంగారి మతసంబంధమైన నిబంధనలను కొంతమట్టుకు గ్రహించుదురు.

యావత్తు మహమ్మదీయ గ్రంథకర్త ప్రాచీనాచార మనుసరించియు, మమ్మునేలు చక్రవర్తిగారియందుండతగిన రాజభక్తినిగురించియు, మీముఖ్యాభిప్రాయమును కనుపరిచియున్నారని నేనుల్లాసముతో నుదాహరించుచున్నాను. మరియును ఆలాగు జరిగించడములో మహాపవిత్రమైన బోధకులగు హజరత్ సయ్యదినా మహమ్మద్‌గారియొక్క ముఖ్యప్రమాణమును మీరు విశ్వాసముతో ననుసరించియుండుటనుగురించి సంతోషించుచున్నాను.

మీకు తెలుగుభాషయందు విశేష పరిశ్రమముండుటవల్ల ప్రకృతాంశమునకు సమానాంశమగు నింకా కొన్ని పుస్తకములు మీరు వ్రాయుదురనియు అందువల్ల మనమహమ్మదీయ సహోదరులందరు గొప్పమేలును, వినీతియును, పొందుదురను పర్యవసన్నాభిప్రాయముతో నేను ముగింపుచేయుచున్నాడను.

మీయొక్కవిధేయుడు,

(దసకతు) సయ్యద్ ముస్తఫా హుశేన్,

కడపఖాజీ.

మహమ్మదీయ మతవేదాంతగ్రంథంబుల ననేకంబుల జక్కగా బరిశోధించి యాగ్రంథార్థంబుల సంగ్రహించి సకల మతావిరోధంబుగ బండితపామరులకును సాధారణంబుగ దెలియునట్లు సులభశైలితో మ॥రా॥రా॥శ్రీ, మంజూమియ్యా సాహేబుగారిచే నాంధ్రభాషయందు నొకగ్రంథంబు రచియింపంబడెను. ఆగ్రంథంబు సాంతంబుగ నవలోకించినయెడ మహమ్మదీయమతంబును లేశంబునైన దెలియక యాభాషయందసూయాదౌష్ట్యంబుల నారోపించువారలకు నైనను "ఆహా! యీమహమ్మదీయ మతంబింత శ్లాఘ్యంబై యిట్టిమహాతత్వార్థప్రదాయకంబైనదిగదా" యని యాశ్చర్యంబు గలుగజేయుటం బట్టి యీగ్రంథంబునకు మహమ్మదీయ మతప్రకాశంబను నామంబొప్పితమై యుండును.

(దస్కతు) క॥ రాఘవాచార్యులు.

శ్రీమదఖిలవసుంధరారమణీమణీ శిరోరత్నంబగు కడపసమాఖ్యావిఖ్యాతపత్తనోత్తమంబుననుండు సజ్జనాగ్రగణ్యులగు శ్రీమన్మంజూమియ్యాగారు.

మహమ్మదీయ తత్వగ్రంథపయఃపారావారంబును స్వమనీషామంథర వసుంధరాధరంబుచే మథియించి తత్వసారామృతంబుద్ధరించి యాంధ్రభాషా సరణిచే సకలసుమనోరంజనంబుగ నీగ్రంథంబు రచియించిరి.

మహమ్మదీయ తత్వాంశమునకును హిందూమత తత్వాంశమునకును భేదమేమియు లేదను సంగతి తెలియక యామతద్వయమునకు గలిగియున్న విరోధతాపంబీతత్వామృతపానంబున నుల్లంబులనల్లనల్లన చల్లారసాగెను.

మహమ్మదీయభాషాపరిశ్రమములేని మహమ్మదీయ మతస్థులకును ఇతరమతస్థులకును, మహమ్మదీయభాషా పరిశ్రమముండియు నతివిస్తృతగ్రంధనిరీక్షణావసరంబులేక విచారపడు మహమ్మదీయ మతస్థులకును అత్యంతముపయుక్తముగానీతత్వసారామృతమును రచియించిసజ్జనులకు మహోపకారమొనరించిన మహమ్మదీయమతావలంబి జనశిరోరత్నంబగు శ్రీమన్మంజూమియ్యాసాహేబుగారికి శ్రీభగవంతుండు నిరంతరమహానందమొసంగుగాక యని మహాకుతూహలముతో బ్రార్థించుచున్నాను.

(దస్కతు) కందాళ్ల దాసాచార్యులు.





# బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్.



అనగా

శ్రీకరకృపాకరుడును పరమశాంతి స్వరూపుడునగు సర్వేశ్వరునియొక్క నామంబుతో మాశాస్త్రమందలి అనగా ఖురానెషరీఫ్ నందలి సర్వపద్ధతుల నాంధ్రభాషయందు సులభశైలిచే నశేష జన హృద్యంబుగ వ్రాయబూనుకొన్నవాడను.

మహమ్మదీయమతస్థు లేమిపని జేయబూనుకొన్నను ఆదియందు "బిస్మిల్లా" అనిచెప్పుచున్నారు. ఎందుకనగా నీవాక్యము సకల పాతకజాలములను హరింపజేసి శ్రేయస్కరములగు కార్యములను ప్రాప్తింపజేయును.

గాన పైనుదాహరించిన వాక్యమునే యెల్లప్పుడు నెడతెగక స్మరణజేయుచుందురు.

అందువల్లనే శ్రీభగవంతుడు ఖురానెషరీఫ్ అనెడు మహమ్మదీయుల మతస్థులయొక్క పరిశుద్ధమైన మతగ్రంథమనెడు నొక ఆభరణమునకు పైవాక్యమనగా.

"బిస్మిల్లా-హిఱ్ఱహ్మా-నిఱ్ఱహీమ్" అనునొక గొప్పయగు. అమూల్యమగు పరిశుద్ధమైన నామము శిరస్సునందు అనగా గ్రంథ ప్రారంభమునందు రచియింపచేసి పైనామస్మరణతో గ్రంథము ప్రారంభించవలయునని ఆజ్ఞనుపాలించెను.

## అల్లాహ.

అనగా సృష్టికర్త.

మహమ్మదీయఁలు (అల్లాహ) సృష్టికర్తపైన యెటువంటి విశ్వాసముంచినారనగా.

సర్వశక్తిగల భగవంతుండొకడే. అతనికిజన్మములేదు. నాశములేదు. ఒకరిసహాయాపేక్షలేదు. అతనికితల్లిలేదు. తండ్రిలేదు. అతనికిసమానమైన దైవములేదు.

ఇట్టిసర్వశక్తిగల శ్రీభగవంతునివిషయమై పరిశుద్ధమైన మహమ్మదీయఁల ఖురానెషరీఫ్ లో నీతెరంగున వర్ణించబడియున్నది.

ఖుల్ - హు - వల్లాహు - అహద్ - అల్లా - హుస్ - స్సమద్-లం - ఎలిద్ - వలం - యూలద్ - వలం - యకుఁ - లహు - కుఫ్వఁ - అహద్.

# మహమ్మద్.

శ్రీభగవంతుని చెంతనుంచిపంపబడిన మహాత్ముడగు హజరత్ మహమ్మద్‌గారియందు మహమ్మదీయలు అందరు ఎట్టివిశ్వాసముంచినారనగా.

హజరత్ మహమ్మద్‌గారు శ్రీసృష్టికర్తవలన పంపబడినవారనియు, వారినికొలుచువారికి సన్మార్గము చూపువారనియు, పాపాత్ములవిషయమై శ్రీదేవునిదగ్గర ప్రార్థించి సర్వజనరక్షణ చేయువారనియు, ఏకాభిముఖులై భక్తిశ్రద్ధలతో సేవింపుచున్నారు.

మరియును శ్రీభగవంతుడుతప్ప యితరదైవములేదనియును. శ్రీదేవునిసృష్టిలో హజరత్ మహమ్మద్‌గారు ఇతరులవలె చేరినవారైనను, శ్రీభగవంతునివద్దనుంచి ముఖ్యముగా పంపబడినవారని. వారు వకాణించి యుండుటయెగాక యావత్తు మహమ్మదీయలుకును తదేకమైన విశ్వాసము వారియందుంచునటుల ఆజ్ఞాపించియున్నారు.

ఉదాహరణము.

అష్‌హదు - అన్ - లాఇలాహ - ఇల్ - లల్లాహు - వహదహు - లా - షరీక - లహు - వ - అష్‌హదు - అన్న - మొహమ్మదన్ - అబ్దుహు - వ - రసూలుహు.

## ఇమాన్.

అనగా విశ్వాసము, లేక, నమ్మిక.

శ్రీభగవంతుని యుత్తరువువల్ల హజరత్ మహమ్మద్‌గారు చెప్పిన యావదంశములును, మనః స్ఫూర్తిగానమ్ముట. వాకుఁతో చెప్పుట.

ఉదాహరణము.

ఎఖ్‌రారున్ - బిల్ - లె - సాని - వ - తస్‌దీఖున్ - బిల్-ఖల్‌బ్- ఇట్టి "ఇమాన్" తెలిసినమహమ్మదీయన్‌లు. "మోమిన్" ముసల్ మాన్. అని పిలవబడుతారు.

ఇమాన్ నమ్మిక.

ఇస్లామ్. సదాచారము.

ఈరెంటికి భేదమేమనగా "ఇమాన్ అనగా" మనోనిశ్చయము. ఇస్లాం అనగా మతసంబంధమైనహజరత్ మహమ్మద్‌గారి చేతచెప్పబడిన సదాచారములను విధేయతగా నడుచుకొనుట.

## ఇమానె-ముఫ్ స్సిల్.

అనగా మహమ్మదీయన్ మతస్థులయొక్క విశ్వాస వివరము. శ్రీభగవంతునియందు విశ్వాసముంచడమును. దేవదూతలయందు విశ్వాసముంచడమును. చతుర్వేదములను నమ్మడమును. యావత్తు పైగంబరలు అనగా మహాత్ములయందు విశ్వాసముంచడమును. ప్రళయ

కాలమునందు. శ్రీభగవంతుడు చేసే న్యాయపరిపాలనయందు వి శ్వాసముంచడమును. మరణానంతరమున తిరుగి లేచే అంశమునుగు రించి నమ్మడమును. మొదలైనవి.

ఉదాహరణము.

ఆమన్తు - బిల్లాహి - వ - మలాయకతిహి - వ - కుతుబి హి - వ - రుసులిహి - వల్ - యౌమిల్ - ఆఖిరే - వల్ - ఖదరే - ఖైరి హి - వ - షర్రెహి - వల్ - బాస - బాదల్మౌత్.

ఇందులోని అతిరహస్యములను అనగా అంతరార్థములను మ హమ్మదీయన్లుగురు శుశ్రూష చేయుచు గ్రహించుచున్నారు.

## ఇమ్హా నెముజ్ మిల్.

అనగా మహమ్మదీయన్ మతస్థులయొక్క విశ్వాససంగ్రహ ము-లేక-సంక్షేపము.

శ్రీభగవంతునినమ్మడము. శ్రీభగవంతునియొక్క అన్నియుత్తరు వులను శ్రీభగవంతుని ఆజ్ఞానుసారముగా హజరత్ మహమ్మద్‌గారి చేనివ్వబడ్డ యావత్తుయుత్తరువులను నమ్మడము.

ఉదాహరణము.

ఆమన్తు - బిల్-ల్లాహి - కమాహువా - బేఅస్మాయెహి - వ - సిఫాతిహి - వ - ఖబిల్తు - జమీయె - అహకామెహి.

ఇందులోని అతిరహస్యములను మహమ్మదీయన్లు గురుముఖ ముగా వేదాంతవిషయములను గ్రహించుచున్నారు.

మహమ్మదీయుల మతస్థులయొక్క మొదటియాచారములలో ముఖ్యముగా దైవసంబంధమైన అయిదు "ఫరజ్ అనగా" నిబంధన లున్నవి.

## బినాఇస్లాంకె పాంచ్ ఫరజ్.

(1) కలమయెతయ్యాబ్ పడనా—పరిశుద్ధమైన మహావాక్యము పఠించడము.

(2) నమాజ్—శ్రీదేవునిప్రార్థన.

(3) రోజా—ఉపవాసము.

(4) జకాత్—ధర్మము.

(5) కాబేషరీఫ్ కా హజ్ కరనా—మహాస్థలముయొక్క యాత్ర చేయడము.

## కల్మయెతయ్యాబ్.

అట్టి పరిశుద్ధమైన మహావాక్యమేమనగా.

లా-ఇలాహ-ఇల్-లల్లాహు-మహమ్మదర్

రసూలుల్లాహి.

ఈమహావాక్యముయొక్క అర్థము మహమ్మదీయన్ మతస్థులందరు నీతెరంగున ఏకాభిముఖముగా నమ్మియున్నారు.

శ్రీసృష్టికర్తతప్ప యితరదైవములేదు.

హజరత్ మహమ్మద్ అనువారు శ్రీదేవునివలన పంపబడినవారు.

మహమ్మదీయన్ మతస్థులలో ఆదియందుపదేశము చేయబడునది మిక్కిలి పవిత్రమైన యీమహావాక్యమే.

మహమ్మదీయన్ వేదాంతులు పైమహావాక్యముయొక్క అంతరార్థము నీక్రింద నుదాహరించబడిన తెరంగున నుపదేశించినట్లు తెలియబడును.

౧ ౩ ౪

లా-ఇలాహ-ఇల్ లల్లా- మొహమ్మద్-

౫ ౬

రసూల్-అల్లా.

ఈమహావాక్యమే షట్పటిములుగల రత్నమాలయని చెప్పబడును.

ప్రతిపదమునకు షడ్విధములైన అర్థములను కల్పనచేయుచు వట్టుకు ముప్పదారు అర్థములను నిరూపించిరి.

మరికొందరు ప్రతిపదమునకు మూడేసివిధములైన యర్థములు కల్పనచేయుచు వట్టుకు పైసంఖ్యలోని సగమనగా పదునెనిమిది విధములైన అర్థములను కనుపరిచిరి.

ఉదాహరణము.

అఠారావబూడ్షిం. కత్మైకేఇన్‌తఁమే. అఠీనేలిఖ్షిం. ఆరి ఘోకేహక్రమే.

మరియును వేదాంతులందరు ఏకీభవించి పైనుదాహరించబడిన తెరంగున ఆయాపీఠస్థులు పైమహావాక్యముయొక్క అర్థములు తెలియపరుచుచు కడపటి పైషట్పదములుగల రత్నమాలార్థమును త్రిపదములలో నీక్రింద నుదాహరించిన విధముగా మనస్సులో యోగాభ్యాసరీతిచే జపముచేయుటకురచియించిరి.

## లా-ఇలాహ-ఇల్‌లల్‌ల్గా.

అనగా యెల్లప్పటికి నశింపనివస్తువు దేవుడేఅనియు తద్వ్యతిరిక్తమైనదేదియును లేదనియును. ప్రపంచాధీనమైన సర్వవస్తుసమితి అశాశ్వతమనియు గురూపదేశముచేత తెలుసుకొనిమొదట పరిశుద్ధుడును. పద్మాసనాసీనుడై ఏకదృష్టితో "లా" అనువర్ణమును మణిపూరకచక్రమునుంచి వాయుస్థానమగు అనాహతమువరకు ధ్యానంబుచేసి. పిమ్మట "ఇలాహ" అనేపదమును సహస్రారమువరకు కొనిపోయిధ్యానించి పిదప "ఇల్‌లల్‌ల్గా" అనేపదమును సహస్రారమునుంచి ధ్యానముచేయుచు కడపటహృదయ కమలమున, లయము చేయుబడును. ఇదియోగాభ్యాసరీతి.

# సమాధిక్రమము.

| | | |
|---|---|---|
| లా. | ఇలాహ. | ఇల్‌లల్లా. |
| నఫ్‌స్. | రూహు. | నూర్ |
| బిందు. | నాద. | కళ. |

కొందరు పైనుదాహరించిన త్రిపదంబులును గరిష్ఠనిష్ఠావిశిష్టత్వంబున బిందువు, దేహంబనియును, నాదము, జీవుడనియును, కళ, ఆత్మయనియును, నిశ్చయంబుగా దలంచుకొని సమాధియందు సర్వంబునుమరచి గాలివలన లయంబుచెందని దీపంబుపగిది సంపూర్ణకాముతై వర్తింపుచున్నారు. ఇందుకు దృష్టాంతము.

మనోఽగ్రేవసతెబిందుః ప్రాణాగ్రేవసతేకళా ॥ ఉభయోర్లీయతేనాదః లయఇత్యుచ్యతెబుధైః ॥ అనాహతస్యశబ్దస్య తస్యశబ్దస్యయోధ్వనిః ॥ ధ్వనేరంతర్గతంజ్యోతిః జ్యోతిరంతర్గతంమనః మనోవిలయంయాతి తద్విష్ణోః పరమంపదమితి. ఇదిగాక మహాస్మదీయః వేదాంతులుతనుతానే దెలియువస్తు వెంతవరకు లభించునో అంతవరకు భజించుచు తదనంతరమున నిశ్శబ్దంబుగా నుండవలసినదనియును ఇకనేలాటిసంగతులను యోచించుటసరిగాదనియును నీమహాస్మదీయమతమందు చెప్పబడియున్నది.

మహాస్మదీయః వేదాంతులు పైనుదాహరించిన కొల్మయెతయ్యిబ్‌లో ( అనగా మహావాక్యములో ) ఈషట్‌పదములను యెవ్విధముగా తలచినారనిన.

శ్రీహిందూమతస్థులు.

# ఓం నమః శివాయ.

ఈయక్షరంబులను మహాపవిత్రమైనవియనియును దైవస్వరూపములనియును మోక్షప్రాపకములనియును తలచినారో తదేకార్థముగా నిర్ధారణచేసిరి.

## నమాజ్.

శ్రీదేవునియొక్క ప్రార్థనకుముందే మహమ్మదీయమతస్థులకు ఆచారనిబంధనలు యేర్పాటు చేయబడియున్నవి.

## వజూ.

శ్రీభగవంతునిపై విశ్వాసముతో మొదట యేమనుజుడైతే వజూచేయనారంభించునో అప్పుడునాహస్తములు పాపమును చేయకుండగను. తెలియకచేతులతో జేసిన పాపములను పరిహరింపవలసినదని కడుగుకుంటున్నాడు.

నోటియందు ఉదకమునుంచి పుక్కిలించియుమియుచున్నాడు. ఏమనగా ఓభగవంతుడా నీయందుజ్ఞాపకమును. నీయందుకృతజ్ఞతయును. నీవుహజరత్ మహమ్మద్ గారికి పంపబడిన ఖురానెషరీఫును చదువుటకు నాకపేక్ష దయచేయుము - అనియును.

ఎప్పుడైతే ముక్కునీటిని నూరేకునో అప్పుడు ఓ దేవుడా స్వర్గమునందునుండు మంచిసువాసనను నాముక్కుకు వచ్చేలాగు చేయుము. నేనుచేయుకార్యములవల్ల నీవుసంతోషింపుమనియును ప్రార్థించుచున్నాడు.

ఎప్పుడైతే నీటితో ముఖమును పరిశుద్ధమైనదానిగా చేయబూనునో అప్పుడు ఓభగవంతుడా నీవు నీభక్తులకు ముఖకాంతినిచ్చే చందమున నాసగితివో అటితిగానాకు ముఖకళనివ్వమని ప్రార్థించుచున్నాడు.

ఎప్పుడైతే కాళ్లనునీటితోను కడగబూనునో తత్కాలమందు ఓభగవంతుడా నాపాదములునియొక్క పుణ్యస్థలములకు వచ్చునవియుగాను మిక్కుటమైన బలముకలవిగాను సత్పురుషులచెంతకు సద్వగాబోవునట్టివిగానును చేయుమని ప్రార్థించుచున్నాడు.

ఈచందమున నే ఏమహాత్ముడియక్ మనుజుడైతే, త్రికరణశుద్ధిగా చేయునో అట్టిపుణ్యాత్ముని దేహమందలి సర్వాంగసంగతములగు పాపరాసులెంత దుర్హరములైనను, నశించుచున్నవనియు. నట్టిపురుషుడే పరిశుద్ధుడని హజరత్ మహాత్మ్ గారు నిరూపించియున్నారు.

ఈపగిది మహాత్ముడియక్ వేదాంతులు పైనవ్రాసియున్న యావదంశములును అంగీకరించి యివి మనుజునియొక్క బాహ్యశుద్ధి అనియు. అంతఃశుద్ధిఅనగా మనోవాకాయ కర్మములనేకీభూతంబుగా చేసి అంతరార్థ పర్యాలోచనకలిగి కామ, క్రోధ, లోభ, మోహ,

మద, మాత్సర్యాది, శత్రుషడ్వర్గంబుల జయించి, యద్యత్పశ్యతి చక్షుర్భ్యాం ॥ తత్తదాత్మేతి భావయేత్. అను మహావాక్యమునుబట్టి నిశ్చయముగా భగవంతుని స్మరియించుటయే మనశ్శుద్ధియని నిరూపించిరి.

## అజాఁ. అనగా ప్రార్థన పిలుపు.

| | |
|---|---|
| అల్లాహు—అగ్బరు<br>అల్లాహు—అగ్బరు | అనగా శ్రీభగవంతుడు గొప్పవాడు. |
| అష్-హాదు-అన్-లా-ఇలాహ.ఇల్లల్లాహు. రెండు పర్యాయములు వచించుట. | ప్రమాణముగా వచించుచున్నాను శ్రీసృష్టికర్తకంటె నితరదైవము లేదు. |
| అష్-హాదు-అన్న-మొహమ్మదర్-రసూలుల్లాహి. రెండుఆవర్తులు వచించుట. | ప్రామాణముగా భాషింపుచున్నాను హజరత్ మహమ్మద్ గారు శ్రీభగవంతుని వల్ల పంపబడినవారే. |
| హాయ్యా-అలస్-స్సలాత్ రెండుపర్యాయములు పిలుచుట. | ప్రార్థననిమిత్తము రండు |
| హైయ్యా-అలల్-ఫలా రెండు పర్యాయములు పిలుచుట. | రండు-మోక్షమును పొందుడు |

తెల్లవారుజామున పిలవబడె - అజాలో-స్సైననుదాహరించబ
డిన మేరకుచెప్పుచును మరియొక అంశము అన్నగా.

| | |
|---|---|
| అస్సలాతు-ఖైరుక్ మినక్-నవుమ్.అనియు రెండుపర్యాయములు చెప్పవలెను. | నిద్రకంటే - శ్రీభగవంతుని ప్రార్థనమేలు. |

"అష్ - హదు - అన్న - మొహమ్మదర్ - రసూలుల్లా"

మహమ్మదీయక్లు ఈపదార్థమును అనగా నీగొప్పనామమును
అజాలో విన్నమాత్రముననే అతిప్రేమాధిక్యమున రెండు అంగు
ష్ఠములచేత కంటిపాపల చాయను అద్దుకొని ముద్దుపెట్టుకొనుచు
న్నారు.

ఇటులవారు కంటిపాపలచాయను అంగుష్ఠములతో స్పృశిం
చి ముద్దుపెట్టుకోవడమునకు కారణమేమనగా మహమ్మదీయక్లు ని
రంజనుడైన శ్రీభగవంతుడు సృష్టికాలమున హజరత్ మహమ్మదుగా
రను పేరుపొందిన తనకళనొకటిని నిర్మించినాడనియును, ఆకళ యి
టునంటిదని, నిరూపించుటకు చెప్పుటకు,వల్లలేక పోయినందునను, నది
సూక్ష్మవస్తువుగావున, మలినవస్తుసంయోగమునకు రాదనియు, దాని
చాయయే, నేత్రమధ్యగతమైనందుచెత నీచందమున చేయుచున్నవా
రమని నిరూపించిరి.

ఇందుకు దృష్టాంతము.

చక్షుర్మధ్యస్థితంగుహ్యామంగుష్ఠే పరమాత్మకం ॥ తదర్థంచవి పర్యార్థంతస్యాగ్రేసూక్ష్మదర్శనం ॥ నీలతోయదమధ్యస్థంవిద్యుల్లేఖేవ భాస్వరం ॥ గుహ్యాద్గుహ్యాతమం గుహ్యాంచక్షుస్థానేషుసంస్థితం ॥ తన్మూర్తిర్లక్ష్యతేదృశ్యమాపాదతలమస్తకమితి ॥

మహమ్మదీయన్ మతములో అయిదు వేళలు అనగా.

| | |
|---|---|
| సుబో. | తెల్లవారుజాము. |
| జోహార్. | మధ్యాహ్నము 1 గంట. |
| అసర్. | సాయంకాలము 4 గంటలు. |
| మగరిబ్. | సాయంకాలము 6 గంటలు. |
| ఇషా. | రాత్రి 9 గంటలు. |

ఈఅయిదు వేళలలో "అజ్జా" పైనుదాహరించిన మేరకు చేయవలసినదిగా నున్నది.

ప్రతిమతములో పూజకు పిల్వడమునకు నొకసంజ్ఞ అనగా గుర్తుఏర్పడియున్నది. అనగా ఘంటకొట్టడము. శంఖమూదడము. ఇత్యాదులు.

అటుల శ్రీమహమ్మదీయుల మతములో “అజా” పూజకుగట్టిగా అరచి పిల్వడమనే యొక సంజ్ఞయేర్పడెను.

“నమాజ్” చదవనివారికి కలిగెడు దోషములనీ క్రిందవ్రాయుచున్నాను.

పైనచెప్పినమేరకు అయిదువేళలలో “నమాజ్” చేయడమనగా. ఆ అయిదు సమయములలో శ్రీభగవంతుని దివ్యమందిరముజొచ్చి సన్నిధానమునుపొంది, సేవలో హాజర్ కావడము.

మరియును మనుజుడు సమీపమునందున్న నదిలో నైదువేళల స్నానముచేయగా, ఆమనుష్యుని సర్వాంగ సంగతములైన పాపములు నశించినట్టుగా అయిదువేళల “నమాజ్” చేయుటవల్ల బాహ్యాదురిత జాలములు దగ్ధమైపోవును.

“నమాజ్” విషయమై అయిదుకాలములను నిరూపించుటకు కారణమేమనగా. మనుజునికి పుణ్యసంపాదనవిషయమై యొక అతిశయమైన అపేక్ష చెందుటకు.

మరియు. ప్రపంచాధీనమైన యితర సర్వకార్యములు. “నమాజ్” విషయమై నిర్ణయించబడిన సమయముతప్ప యితరవేళలలో ముగింపుచేసుకొని, పైనసమయములగురించి నిరీక్షించుటకు.

"నమాజ్" విషయమై నిర్ధారింపబడిన కాలనిర్ణయము వల్ల. అమూల్యమైన కాలజ్ఞానను కల్గుటయేగాక. అంత్యకాలము నందు ముఖ్యముగా మనుజునికి మరణసంకటములుమాని, ముక్తి యును గలుగును.

ప్రతిమత నిర్ధారణకొరకు నేపథముగా నొకొక్కచిహ్నమే ర్పడియున్నదో, అదేరీతిగా, నీమతనిర్ధారణకు, "నమాజ్" అనేగుర్తు యేర్పడెను. ఇట్టి "నమాజ్" చదివేవారినిలోకులు మహా న్మదీయులని వక్కాణింతురు.

శ్రీభగవంతుడు ఈ "నమాజ్" యందు ముఖ్యమయిన నొ క ప్రేమనుంచినాడు. అందువల్లనే కొందరునిలవబడి. కొందరువంగి. కొందరుకూర్చొని. ఇత్యాదివిధముల ప్రార్థించుచున్నారు.

దేవదూతలు ముఖ్యముగా యెల్లప్పుడు శ్రీభగవంతుని సన్ని ధిలో ప్రార్థించుచున్నారు.

ఆలోచించిచూడగా. ప్రపంచములోనుండెడు అనేకజీవరా సులు నానావిధములుగా శ్రీభగవంతుని ప్రార్థనలోనేయున్నవి.

ఎట్లనగా. చెట్లు గొప్పమర్యాదగల భయభక్తితో నిలవబడి ధ్యానములోనున్నవి.

గుట్టలు! పర్వతములు. యెల్లప్పుడు నిశ్శబ్దముగా శ్రీభగవంతుని ధ్యానములోనున్నవి.

ప్రపంచములోని నడిచే సర్వజంతువులు దేవునిముందర శిరస్సుతోవచ్చి ధ్యానించుచున్నవి.

ప్రాకెడుజంతువులు అష్టాంగములతో శ్రీభగవంతునికి వందనముచేసి ధ్యానించుచున్నవి.

మహమ్మదీయులలో " నవ్రాజ్ " చేయుకాలమునందు నిలవడము. వంగడము. కూర్చోవడము. శిరస్సువంచడము చేతులుకట్టుకోవడము. నొసలు భూమికితగులునట్టుగా మ్రొక్కడము. ఇవ్విధములైన మర్యాదలున్నవి.

ఇట్టి ఆశ్చర్యమునకు కారణమేమనగా శ్రీభగవంతుని సన్నిధిలో గొప్పమర్యాద చూపుటకుగాను, నిలవబడడము, విధేయత కనుపరుచుటకుగాను, చేతులుకట్టుకోవడము, వందనముచేయుటకుగాను, శిరస్సునువంచడము సన్నిధిలోమిక్కిలి అల్పుడననిభావించి వంగడము, అతివినయముతో నిశ్శబ్దముగా కూర్చోవడము నీకంటె నితరదిక్కులేదని నొసటినిభూమికి తగిలించి మ్రొక్కడము.

ఇవి " నవ్రాజ్ " లో జరిగెడు విధములయొక్క నీతులు.

ఈ " నవ్రాజ్ " విషయమై యిదివరకు నుదాహరించబడినవి బాహ్యార్థములు.

మహాత్మ డీయోక్ లు పైనుదాహరించిన విధముగా "నవరాజ్" నుచేయుచు దీని అంతర్రార్థమును గురుమూలమున గ్రహించియను ష్ఠించుచున్నారు.

ఎట్లనగ. ముఖ్యముగ మనస్సును చాంచల్యము నొందనీయక తదేక ధ్యానమైనదానిగా నిలపవలెను.

శరీరమునందు మనస్సు రాజుగానున్నది.

ఎటువంటిసంకల్పములు మనస్సున జన్మించుచున్నవో ఆవిధం బుగానే సుకార్య దుష్కార్యములు సంభవించుచున్నవి.

ఇట్టికోరికెలు మనస్సులో నుత్పత్తియయి బుద్ధికితోచును.

ఇందువల్ల స్పష్టముగా తెలియబడు నంశమేమనగా.

| | |
|---|---|
| మనస్సు. | రాజు. |
| బుద్ధి. | మంత్రి. |
| శరీరము. | సేవకుడు. |

కాబట్టి బుద్ధియనెడు మంత్రివల్ల ప్రేరేపితమైన కార్యము లన్ని శరీరమువల్ల నెరవేర్చబడుచున్నవి.

గాన వేదాంతులు మనోనిశ్చయమే ప్రధానమని నిశ్చయజ్ఞా నముచేత కాలవిడంబనము చేయక సర్వదా హృత్పద్మమందు శ్రీభగ

వంతుని భక్తిపూర్వకముగా స్మరించుచు సమాధినిష్ఠతో నివసించుచు న్నారు. వారికి అదే "నమాజ్"

కొందరు వేదాంతులు "నమాజు" ముఖ్యమైన పదివిని జెందించు యోగమని భావింపుచున్నారు.

అట్టి యోగాభ్యాసమువల్ల శరీరము వ్యాధిరహితమై సుఖక రంబుగా నుండును.

ఇటువంటి యోగాభ్యాస నిరతులు జీవన్ముక్తులు కాగలరు. వారుజేయు ప్రార్థనచేత శ్రీభగవంతుడెప్పుడు సంతోషించుచుం డును.

పైనుదాహరించబడిన తెరంగున "అజా" యివ్వబడిన పిదప మహమ్మదీయక్ మతస్థులు మశీదులో పడమటిదిక్కునకు ఎదు రుగానిలిచి "నమాజ్" ప్రారంభించుటకు ముందుగా నీవిధ ముగా చెప్పుచున్నారు.

నాముఖమును శ్రీభగవంతునితట్టు చేసితిని. ఎవ్వడు ఆకాశ మును భూమిని సృజించినాడో ఆదేవునిమనస్సుతో ధ్యానము చేయు చున్నానను విశ్వాసము నెవ్వడైతె మనస్సునందుండుదానిగా చేయు నో అప్పుడు దిశానిర్ణయములేకనె నేవైపుచేతనైనా నిలువబడి శ్రీభ గవంతుని ప్రార్థింపవచ్చును

## దృష్టాంతము.

అయినమ - తువల్లు - ఫసమ్మా - వజహూల్లా.

శ్రీభగవంతుడు సర్వవ్యాపకుడు. గనుక ఏతట్టుతిరిగిచూచినా ఆదిక్కున నేకను పడుచున్నాడని.

మహమ్మదీయుల వేదాంతులు వక్కాణించుచున్నారు.

"ఖిబల" అనేపదమునకు అర్థమేమనగా.

ఏదిక్కుకుతిరిగి మనస్సుతో శ్రీభగవంతుని ప్రార్థనచేయునో ఆదిశయే పడమటిదిశయని పిల్వబడును.

మహమ్మదీయుల పూజాస్థానమునకు స్థళనిర్దేశములేదు. పరిశుద్ధముగానుండు నేస్థళమందైనను ప్రార్థనచేయవచ్చును.

ఏస్థళమునందైతె మహమ్మదీయులు ప్రార్థనచేయుచున్నారో ఆస్థళముపూజార్హమైన మశీదని నిరూపింపబడును.

"కాబా" అనగా మక్కామందిరము. ఆలయముతట్టు ముఖముచేసి ప్రార్థించుటవల్ల అట్టి "కాబా" స్థళమునకే పూజావందనాదులు సలుపుతున్నారని తలచుదురు.

అటులకాదు. ప్రార్థనలో "కాబా" అంశమేలేదు. శ్రీభగవంతుని ప్రార్థనతప్ప నితరములేదు.

ఉదాహరణము.

ఇన్నీ - వజ్జహతు - వజ్హియా - లిల్ - లజీ - ఫతరస్సమా వా తే - వల్ఆరదా - హానీఫన్ - వమా - అనా - మినల్ - ముష్ రెకీన్.

అనగా నెవ్వడైతే భూమిని ఆకాశమును సృజించినాడో, ఆ సృష్టికర్తతట్టే ముఖముచేసి ప్రార్థించుచున్నాను. అట్టిభగవంతుడు తప్ప యితరదైవమును కొలవను.

అనిచెప్పి పడమరతట్టుముఖముచేసి "అల్లాహు" అక్బర్

అనగా "దేవుడుగొప్పవాడు" అనివక్కాణించుచు. తనరెండు చేతులతో (లోలీకి) "చెవితమ్మెలను"

స్పృశించి, గొప్పమర్యాదతో శ్రీభగవంతుని దివ్యసన్నిధిలో గులామ్వలె నిలవబడి దోషరహితుడవని స్తోత్రముచేయుచు మిక్కిలి వినయముతో చేతులు సేవకునివలె కట్టుకొని యీక్రిందనుదాహరించబడిన మహామంత్రము పఠించబడును.

సుబహానకా - అల్లాహుమ్మా - వ - బెహందెకా - వ -తబార కస్మొకా - వ - త -ఆలా - జద్దుకా - వలా - ఇలాహా - గైరుకా - ఆవూజు - బిల్లాహీ - మినష్ - షైతా - నీర్రజీం.

ఓభగవంతుడా? నీవు నిర్మలమైనవాడవు పరిశుద్ధాత్మగలవాడవు. నీనామము, మంగళ ప్రదమైనదిగాను స్తోత్రార్హమైనదిగాను

ఉన్నది. నీకంటె నితరదైవములేదు. నామనస్సు పిశాచాదులబాధవల్ల చదరకనీయందే నుండేలాగున రక్షణచేయుము.

అని.

బిస్మిల్లా - హిర్రహమా - నిర్రహీం - అల్హందు - లిల్లాహీ-రబ్బిల్ - ఆలమీన్ - అర్రహమా - నిర్రహమీ - మాలికె - యౌమిద్దీన్-యీయ్యాక - నాబుదూ -వ- ఈయ్యాకా - నస్తఈన్ - ఇహదినస్-సిరాతల్ - ముస్తఖీమ్ - సిరాతల్లజీనా - అన్ - అంతా - అలైహీం-గైరిల్ - మగ్దూబె - అలెహీం - వలద్ - ద్వాల్లీన్ - ఆమీన్.

తాత్పర్యము.

నిరతిశయ శాంతికృపాది గుణములుగల నీయొక్క గొప్పనామముతో ప్రారంభించుచున్నాను.

నీవు సర్వప్రపంచములకు స్వామిగా నుండుటవల్ల, యావత్తు స్తోత్రములకు స్థానభూతమైన వాడవుగానున్నావు. కనికరముగలవాడవు. అంత్యకాలమునకు న్యాయాధిపతిగానున్నావు. మేమునిన్ను సేవింపుచున్నారము. పూజచేయుచున్నారము. నీయొక్క సహాయాపేక్షకోరియున్నాము. మంచిదారినిచూపుము. నీవుమహాత్ములయందు కటాక్షించి వారలకుచూపినట్టిదారిని మాకుచూపుము. నీయాగ్రహమునకు పాత్రులుగానుండువారి మార్గమును చూపకుము "అట్లగుగాక"

ఖుల్ - హు - వల్లాహు - అ _ హద్ - అల్లాహు - స్సమద్ - లం - ఎలిద్ - వలంయూలద్ - వలం - యు - కున్ - లహు - కు ఫ్ - వన్ - అహద్.

తాత్పర్యము.

శ్రీభగవంతుడు హజరత్ మహమ్మద్ గారితో సివిధముగా నిరూపించెను.

ఏమనగా. ఓమహమ్మద్ దేవుడొకడేఅని వకాణించుము. దేవుడు పరిపూర్ణుడు. ఒకరి సహాయాపేక్ష కోరేవాడుకాడు. అతనికి సంతానములేదు. జన్మములేదు.

పైనుదాహరించబడిన రెండు మంత్రములు పఠించినపిదప.

అల్లాహు - అగ్బర్ అని వచించి.

" రుకు "

అనగా గొప్పమర్యాదతో రెండుమోకాళ్లమీద వంగి. (సుబహాన-రబ్బియల్ - అజీమ్ )అని మూడుఆవర్తులు జపించ వలయును.

తాత్పర్యము.

నాదేవుడు నిండాఘనత గలిగినవాడుగాను పరిశుద్ధుడుగాను ఉన్నాడు.

సమే - అల్లాహు - లెమఁ - హామిదా - రబ్బనా - లకల్ - హాంద్ - అని వచించుచు చక్కగా నిలువవలెను.

తాత్పర్యము.

శ్రీభగవంతుడు, నేనుచేయుస్తుతిని వింటున్నాడు.

పిదప " అల్లాహు - అక్బర్ " అనిచెప్పి

" సిజ్దా "

అనగా శ్రీభగవంతుని పూజాంతమున తనలలాటముతో భూమినిస్పర్శించి.

(సుబహాన - రబ్బేయల్ - ఆలా ) - అని మూాడుఆవర్తులు జపించవలయును.

తాత్పర్యము.

శ్రీభగవంతుడు గొప్పవాడు మిక్కిలిపరిశుద్ధుడు.

తర్వాత " అల్లాహు - అక్బర్ " అనిచెప్పి.

" దోజానో " అనగా కూర్చ్వాసనము.

పైనుదాహరించిన ఆసనముగాకూర్చుండి ఈమంత్రము జపింపవలెను.

అత్త - హీయ్యాతు - లిల్లాహీ - వ - స్సలవాతు - వత్త య్యబాతు - అస్సలాము - అలైకా - అయ్యుహాన్ - నబీయు - వ - రహమత్తుల్లా హీ - వబరకాతుహు - అస్సలాము - అలైనా - వ - అలా - ఇబాదిల్లా - హిస్సాలె - హీన్ - అష్హదు - అన్ - లా - ఇలాహ - ఇల్లల్లా హు - వ - అష్హద్దు - అన్నా - ముహమ్మదన్ - అబ్దుహు - వ - రసూలుహు.

## తాత్పర్యము.

ఓభగవంతుడా; శరీరాంగములవల్ల. జరిగించబడెడు యావ త్కార్యములు, నోటితోపఠించెడు యావజ్జపములు, నీనిమిత్తము గానే చేయుచున్నాను.

శ్రీభగవంతునివలన పంపబడిన హజరత్ మహమ్మద్ గారిపైన నీవు గొప్పకృపను, ఆశీర్వాదమునుంచెదవుగాక.

నాయందును, ఇతరపుణ్య మనుజులయందును, అట్టిక్షేమ మును కృపను ఉంచెదవుగాక.

నేను ప్రమాణముగా చెప్పుచున్నాను. శ్రీసృష్టికర్తకంటే నితరదైవము లేదు.

నేను యకరారు అనగా వాగ్దత్తము చెయుచున్నాను. హజరత్ మహమ్మద్ గారు నీతట్టునుంచి పంపబడిన మహాత్ముడు.

( దురూదేషరీఫ్ )

అల్లా హుమ్మ - సల్లెఅలా - సయ్యాదెనా - మహమ్మదిన్ - వ-అలా - ఆలెసయ్యాదినా - మహమ్మదీన్ - కమా - సల్ - లైతా - అలా - ఇబ్రాహీమా - వ - అలా - ఆలె - ఇబ్రాహీమా - ఇన్నకా - హామీదున్ - మజీద్.

---

అల్లా - హుమ్మా - వ - బారీక్ - అలా - సయ్యాదినా- మహమ్మదిన్ - వ - అలా- ఆలె - సయ్యాదినా- మహమ్మదిన్ - కమా - బారక్తా- అలా- ఇబ్రాహీమా - వ అలా - ఆలె - ఇబ్రాహీమా, ఇన్నకా- హామేదున్ - మజీద్.

తాత్పర్యము.

ఓభగవంతుడా? నీవు ఎత్తెరంగున హజరత్ ఇబ్రాహీం గారియందును, వారిసంతతియందును, కృపనుంచినావో, అదేవిధమున హజరత్ మహమ్మద్ గారియందును వారిసంతతియందును కృపనుంచుము.

నిస్సందేహముగానీవు అట్టి గొప్పఘనతకు అర్హుడవుగానున్నావు.

ఓభగవంతుడా; నీవు ఏవిధమున హజరత్ ఇబ్రహీంగారి యందును వారిసంతతియందును శ్రేయస్సును సాఫల్యమునుగలుగజేసితివో, అదేరీతిన హజరత్ మహమ్మద్‌గారియందును వారిసంతతి యందును అభ్యుదయమును క్షేమమునుంచుము.

నిశ్చయముగా నీవు గొప్పవాడవనుటకు సందేహములేదు.

పై "దురూద్‌షరీఫ్" అయినపిదప నీప్రార్థన చదవబడును.

అల్లా - హుమ్మగ్ - ఫిర్‌లి - వలె - వాలె - దయ్యా - వలె - వుస్తాదియా - వలె - జమీ - ఇల్ - మూమీనీనా - వల్ - మూమినాత్ - వల్ - ముస్ - లె - మీనా - వల్ - ముస్లెమాత్ - అల్ - అహాయామే - మిన్‌హుం - వల్అం - వాత్ - ఇన్నకా - ముజీబుద్ - దావాత్ - వ - రాఫెవుద్ - దరజాత్ - వ - ఖాజీయల్ - హాజాత్ - బె - రహమెతెకా - యా - అర్హమర్ - రాహెమీన్.

తాత్పర్యము.

ఓభగవంతుడా ? నన్ను నాతలిదండ్రులు మొదలగువారిని నా గురువును, యావత్తు మహమ్మదీయన్ స్త్రీపురుషులను రక్షింపుము.

మరియును జీవితులైయున్నవార్లను మృతిచెందినవార్లనుగూడారక్షింపుము.

నిస్సంశయముగా నా ప్రార్థన నంగీకరించువాడవనియును, సకల శ్రేయోభివృద్ధిచేయు వాడవనియును, నా మనోభీష్టములను నెరవేర్చువాడవనియును తలుచుచున్నాను.

తరువాత "నమాజ్" (ప్రార్థన)

| | |
|---|---|
| ముగింపుకాలములో మీయందు దేవుని అనుగ్రహము ఆశీర్వాదము ఉండుగాక. | అస్సలాము అలేకుం వరహమతుల్లా. |

అని యుత్తర దిశయందును దక్షిణ దిశయందును జూపుచేసి ప్రార్థనము ముగింపు చేయవలెను.

పిదప రెండుకరములెత్తి యీప్రార్థన చదవబడును.

అల్లా- హుమ్మ - అంత - స్సలాము - వ - మిన్ కస్సలాము వ - ఇలైకా - ఎరిజవుస్సలాము - హయ్యినా - రబ్బనా - బిస్సలా- మి - వ - అదఖిల్నా - దారస్సలామ్ - తబారక్తా - రబ్బనా - వ - తఆ - లైతా - యాజల్ - జలాలె - వల్ - ఇక్రాం - సల్లల్లా హు - అలాసయ్యదినా - మహమ్మదిన్ - వ - ఆలా - ఆలె - సయ్యెదినా - మహమ్మదిన్ - వ - అస్స - హాభిహి - అజ్ - మైన్ - బెరహమతెకా - యా - అర్హ - హమర్ - రాహమీన్.

తాత్పర్యము.

ఓభగవంతుడా; నీకృపవల్ల సర్వలోకము క్షేమమును జెందును. మమ్ముల సురక్షితముగా కాపాడి, మాయొక్క ఆయుష్షును, అభివృద్ధిచేయును. అంత్యకాలమునందు స్వర్గప్రాప్తి కలుగచేయును. నీయొక్క గొప్పఘనతను స్తోత్రముచేయుటకు శక్తిచాలదు. తథాస్తు.

## రంజాన్ నెషరీఫ్ యొక్క రోజా.

అనగా రంజాన్ నెషరీఫ్ నెలలో చేయుబడు ఉపవాసము.

రంజాన్ నెషరీఫ్ అనగా మహమ్మదీయన్‌లయొక్క సంవత్సరంబడు తొమ్మిదవ మాసమనబడును.

మహమ్మదీయన్ మతస్థులయొక్క మతము నవలంబించిన యావజ్జనము పైనెలలో తెల్లవారి యుదయకాలముమొదలు రాత్రిచుక్కలు కనుపడెడు కాలమువరకు, నుండుమధ్యసమయములలో భోజనపానాదులును, స్త్రీసాంగత్యములును, జేయకుండా నిషేధింపబడుదురు. ఇందుకే. "ఉపవాసమని" చెప్పబడును. మహమ్మదీయన్‌లు ఈమాసముపూర్తిగా నుపవాసముచేతురు. ఈనెలపుణ్యాకరమైనదిగా భావింపబడును. ఎందువల్లననగా. మహమ్మదీయన్‌లయొక్క వేదమంతయు అనగా "ఖురానెషరీఫ్" ఈనెల తే 27 దిన శ్రీభగవంతునిచేత హజరత్ మహమ్మద్‌గారికి పూర్తిగా నుపదేశముచేయబడినది గనుక అట్టి సుకృతమైనదినముయొక్క రాత్రియందు గొప్పజాగారము చేయబడును.

ఎప్పుడైతే, నీరంజాన్ నె షరీఫ్ నెలలో చంద్రు చూచెదరో, ఆ రాత్రి ఖురాన్ నెషరీఫ్ నమాజ్‌లో (హాఫీజ్) అనగా మహమ్మదీయన్‌లో ఖురాన్ నెషరీఫ్ కంఠపాఠముగా చదువువారు, అట్టివారి చేత ప్రారంభించబడి నిత్యమురాత్రులు నమాజ్‌లో చదవబడి కడపటి తే 27 దిన సమాప్తిచెయబడి హజరత్ మహమ్మద్‌గారికి సమర్పణ చేయబడును.

ఇట్టి "నవ్రాజ్" "తరావీహి" నమాజ్‌నిపిల్వబడును.

ఇట్టిసుకృతమైన నెలలో మహమ్మదీయన్‌లు తమగృహమందు వేదమును చదువుదురు. బీదజనులకు అన్నపానాదుల నిడుదురు.

"జకాత్" అనగా నూరురూపాయిలుకు రెండున్నర రూపాయవంతున చేర్చబడు ద్రవ్యమును యిచ్చెదరు. మొహరంనెలలోగూడా అట్టి జకాత్ ఇచ్చెదరు.

మహమ్మదీయన్ మతములో నమాజ్‌యొక్క నిర్బంధము, బీదలు, భాగ్యవంతులు. అనెభెదములేక అందరికి నెటులవిధిగా నేర్పడియున్నదో అట్లేరంగుననే యీనెలలో "రోజా" ఉపవాసమనేది స్త్రీపురుష, భేదములేకుండా సర్వజనులు చేయతగిన విధిగానేయున్నది.

ఒకవేళ దైవవశంబున కాయిలాపడిగాని లేక ప్రయాణము మీదవెళ్లిగాని యీ నెలలో నుపవాసముండుటకు తప్పిపోయినజనులు కాయిలా స్వస్థమైనపిదప, స్వగ్రామముచేరి "ర్యోజా" ఉపవాసము నాచరించవలసినదిగానే విధింపబడి యున్నది.

ఈనెలలో ప్రతిదినము రాత్రులయందు భోజనాదులను మితముగా నాచరించెదరు.

తద్వ్యతిరిక్తంబుగా భోజనాది కార్యంబు లాచరించెదరేని వారు జేయునుపవాసము ( మకరుహ ) అనగా నింద్యోపవాసమని, యెన్నబడును.

ఉపవాసముండెడువరకు దేవదూతలయొక్క అంశముచెంది యున్నవారుగా భావింపబడుదురు.

ఎందుకనగా దేవతలెప్పటికి భోజనపానాది వర్జితులుగానే యున్నారు.

మహమ్మదీయ మతస్థులలో సుకృతవంతులగు జనులచరిత్రంబును జూడగావారు మిక్కిలి స్వల్పాహారమును గ్రహించి సర్వదా హృదయ సరోజాతమందు శ్రీభగవంతుని ప్రార్థనచేయుచు తదేకనిష్ఠాగరిష్ఠులని స్పష్టముగ తోచుచున్నది. గాన నుపవాసాయాసులకు మదమాత్సర్యాది శత్రుషడ్వర్గ బాధలేమియునుండవు.

ఖురానేషరీఫ్‌లో శ్రీభగవంతుడు ఈరంజాన్ నెషరీఫ్ నెలలో నెవరైతె నింద్రియకృతచేష్టల నెల్లమాని మోక్షాపేక్షగలవారలై నా యందు నిండావిశ్వాసముగలగి యుపవాసము నాచరింతురో అట్టిపుణ్యాత్ములు మిక్కుటంబగు ప్రతిఫలం బనుభవింతురని యాజ్ఞాపించెను.

ఇదియును గాక ప్రతిమనుజుడు సత్వరజస్తమోగుణాధారుడైయుండును. గనుక నిట్టిపుణ్యాస్పదమగు నీయుపవాసవ్రతంబు సలిపెనేని తమోగుణముచేత జరుగుదుష్కార్యంబు లెల్లనశించి సత్వగుణ విలసితంబులగు కార్యంబులయందు నిష్ఠగలవాడగును గాన నీవ్రతంబుమిక్కిలిపుణ్యప్రతి పాదకమైనదిగా నెన్నవలెను.

ఈరంజాన్ నెషరీఫ్‌లో ముప్పదిదినములు నుపవాసవ్రతము సలుపుట తమోగుణప్రచురములగు దుష్కార్యములను నాశమునొందించు నొక ఆయుధవిశేషముగానున్నది.

మహమ్మదీయులు ఉపవాసము నుండుటచేత లోకమునకు నొకమేలుగూడా కల్గును.

ఎట్లనగ, మనుజులయొక్క దారిద్ర్యాది సంకటముల గనుగొని నిండాప్రేమతో అనుగుణమగు కార్యాలోచన చేయుదురు.

ఈనెలల్లో నుపవాసముండువారు, అబద్ధము చెప్పినను, ఒకరిని దూషించినను ఒకరివిషయమై లేనిసంగతులను కల్పనచేసి చెప్పినను, అప్రమాణముచేసినను, పరస్త్రీయందు మనస్సునుంచినను ఉపవాస భ్రష్టులై చెడిపోవుదురని హజరత్ మహమ్మదు గారాజ్ఞాపించిరి.

వేదాంతులీ యుపవాసవ్రతమునుగురించి యతిరహస్యముగా చెప్పెడు ముఖ్యాంశము లేమనగా.

సర్వకాలములయందు నెడతెగక భగవంతునియందే ఇంద్రియనిగ్రహముచేసి ధ్యానముంచడమే, "రోజా" అనగా "ఉపవాసము" అట్టిసమాధి భిన్నమవుటయే. వికల్పమనియును, పిల్వబడును.

## జకాత్.

అనగా ఖురానుషరీఫ్‌లో నుదాహరించిన నిబంధనల మేరకు చేయుధర్మము.

ధనవంతుడు ముఖ్యముగా ధర్మముచేయవలెను. అనగా నూరురూపాయల ఆస్తిగలవాడు సంవత్సరమునకు రు 2-8-0 లు ధర్మముచేయవలెను.

ప్రపంచమునందు ద్రవ్యమనేది అన్నివస్తువులకంటె, మిక్కిలి అతిశయ ప్రేమాస్పదమైన వస్తువు.

అట్టిద్రవ్యమును శ్రీభగవంతుడు ప్రపంచమునందు మనుజుల కనిచ్చి వారిమనస్సును పరీక్షించును.

ఎట్లనగా ధనాఢ్యులునాకు ప్రీతికరంబుగా దానధర్మంబుల ను చేయుదురా, చేయకుందురా అని.

ధర్మము చేయువారు శ్రీభగవంతునియొక్క అనుగ్రహమున కు పాత్రులై యుందురు.

మహమ్మదీయన్‌లలో ద్రవ్యముగలవారు పైనయుదాహరించి నరీతిగా నూటికి రెండున్నరవంతున ధర్మముచేయుటకు గూడపెట్టిన ద్రవ్యమును ఋణాదిబాధితులగు స్వమతస్థులఋణాదిబాధ దొలగించు టకు శ్రీభగవంతునికి ప్రీతిగానిచ్చుచున్నారు.

పైనుదాహరించినరీతిగా ద్రవ్యముపుచ్చుకున్నబిదజనులు తమ కుగలిగియున్నయాపదలనుమాన్పుకొని, మిక్కిలి యానందముచెంది తమకిట్టిమేలుచేసినవారికి క్షేమముగలుగవలయునని శ్రీస్వామిని ప్రా ర్థించుదురు.

ఇట్టి "జకాత్" అనగా ధర్మముచేయుటకు ముఖ్యమైన

కాల మెద్దియనిన.

మహమ్మదీయన్‌లకు సంవత్సరాదిగానుండు మొహరమెషరీఫ్ నెలయును, మిక్కిలిపరిశుద్ధమైన, పుణ్యకరమైన తొమ్మిదవమాసమగు రంజాన్‌షెరీఫ్ నెలయును.

ఈనెలలయందు అట్టికర్మమున అతి రహస్యముగా చేయవలెను.

అహంకారముతో జేయుకర్మము శ్రీభగవంతునిసన్నిధిలో నప్పుడలకాదు.

కర్మముచేయు ద్రవ్యము కష్టార్జితమైనదియు, పరిశుద్ధమైనదియుగా, నుండవలయును.

ఈజకాత్ విషయమై యతిరహస్యములు "కీమియాయె, సాఆదత్" అనగా "ఇక్సీరే హిదాయత్" అనుగ్రంథములోనున్నవి. మరియునితర గొప్పగ్రంథములోను. విశేషముగా నిరూపించబడియున్నవి.

యోగాభ్యాసపరులగు వేదాంతులు కొందరు ద్రవ్యహీనులగాన పరమపురుష ధ్యానరూప ధర్మము నొనరించెదరు.

## కాబేషరీఫ్ కా హజ్ కరనా.

శ్రీభగవంతుని యాజ్ఞానుసారముగా హజరత్ మహమ్మద్‌గారివల్ల ప్రచురముచేయబడిన పైనుదాహరించిన.

"పాంచ్ ఫరజ్" "పంచశాసనములు లేక [illegible]లు" అనగా—1. కలమాపడనా.

2. నమాజ్.

3. రోజా.

4. జకాత్.

5. హజ్.

ఈయయిదునిబంధనలలో 1-2-3 నిబంధనలకు ప్రతిమను జుడును బద్ధుడైయుండవలయును.

. నాల్గు అయిదు నిబంధనలను ద్రవ్యముగలమనుజులం విశేషము గా నాచరించవలసినవి విధిగానున్నవి.

అయిదవనిబంధనమేరకు నిదజనులు యాత్ర జేసిన ట్టైన వార్లకు విశేషసుకృతమును, కలదు.

మక్కా-యే షరీఫ్ అనేమహాస్థళమునకు యాత్ర చేయడము. ఇట్టియాత్రయనేది ధనవంతులు ముఖ్యముగా చేయవలసిన విధిగాను న్నది.

నిదజనులు యాత్రచేసినయెడల వార్లకును సుకృతమును కల దు.

మహామ్మదీయులలో నేమనుజుడైతే యాత్రచేయునో అట్టిమ నుజుడు తల్లిగర్భవాసమునుండి జన్మించిన,దినముందువలె పరిశుద్ధుడై యుండును.

ఎవ్వడైతేనిష్కపటమైనభక్తితో యాత్రచేయవలెనని యుద్దేశించి, ప్రయాణముచేసినపిదప కాలవశమువలన మృత్యువుకధీనుడవునో, వాడును మోక్షమునే చెందును.

ఇట్టి "హాజ్" అనగా "యాత్ర" చేయుటకు సర్వజనులకు తెలపవలెనని మహాత్ములగు హజరత్ ఇబ్రాహీంగారికి శ్రీభగవంతుడాజ్ఞాపించెను. అట్టియాజ్ఞను శిరస్సునందువహించి హజరత్ ఇబ్రాహీంగారు సర్వజనులకు పుణ్యాకరమైన దివ్యక్షేత్ర యాత్రచేయుడీ యని ప్రచురముగా తెలియచేసిరి.

కొంతకాలమునకు శ్రీభగవంతునియాజ్ఞనుశిరస్సునందువహించి మగలహజరత్ మహమ్మద్ గారును తమజనులకు యాత్రచేయునటుల నాజ్ఞాపించిరి.

ఆయాజ్ఞనుశిరస్సునందువహించిఎల్లప్పుడు మహమ్మదీయులందరాయాత్రనుజేయుచున్నారు.

మహమ్మదీయులలో నెవ్వడైతే " కాబేషరీఫ్ కాహాజ్." అను పుణ్యక్షేత్రమగు మక్కేషరీఫ్ కు వెళ్లి యాత్రచేసివచ్చిన పిదప చెడ్డకార్యములలో ప్రవేశించునో ఆమనుజుడు నీతిమార్గమునకుదూర

స్థుడైయుండును. మరియును యాత్రిచేత సంపాదింపబడిన పుణ్యములు గూడా పోగొట్టుకొనుచున్నాడు.

మహాత్ములైన హజరత్ మహమ్మద్ గారి శిష్యులు, ఇతరమతములలోనిమహాత్ములు, లోకులుఅరణ్యావాసము చేయవలెననియును, మఠములుకట్టించి వాటిలోవాసముచేయవలెననియు, సంచారముచేయవలెననియు, గుహలలోను, పర్వతములలోను, ఉండి, జనసంఘమునకు దూరస్థులై యుండవలెననియు, నాజ్ఞాపించియున్నారు.

మాకెట్టివిధమైన యాజ్ఞ చేసెదరనియడుగగా, హజరత్ మహమ్మద్ గారు, మనకు, మనోనిశ్చయముతో మిక్కిలి వైరాగ్యము చెంది, పిల్లలనుభార్యను స్వదేశమునుత్యజించి భయంకరమైనయరణ్యమునందు సంచారముచేయుచు, పాదచారిగా పుణ్యక్షేత్రయాత్ర జేయుట అనగా "కాబేషరీఫ్ హజ్" ముఖ్యధర్మము, అని శ్రీభగవంతుని యాజ్ఞ, యున్నదని, వక్కాణించిరి.

మహమ్మదీయుల వేదాంతులు పైను దాహరించబడిన "పాంచ్ ఫరజ్" అనగా పంచశాసనములనుశిరస్సునందుపహించి, అవలంబించి, విశ్వసించుచు, నీ "కాబేషరీఫ్ కాహజ్" యొక్క అంతరార్థమును నీక్రింద నుదాహరించబడిన తెరంగున నిరూపించిరి.

ఆ వేదాంతులు తమ మనస్సే యొక్క కాబా యని భావించి తమ సర్వేంద్రియములను నిగ్రహించి, శ్రీగురు దివ్యపాదములను ధ్యానించి మనస్సులోని కల్మషములను దుస్సంకల్పములను శ్రీగురుమూలకముగా నుపదేశించబడిన శ్రీమహామంత్రములనగా "అల్లాహుయాహు"

ఇట్టిమహామంత్రములను "అజపా-హంసః-సోహం అను" మహామంత్రములను హిందువులుజపించిన విధముగా" జపించి వశము చేసి వారునిరూపించిన మనస్సుయొక్క స్థానమునందు దృష్టియుంచి యందులో నుద్భవించెడు కళలో మనస్సును లయముచేయడమే పై "కాబేషరీఫ్" యొక్క హాజ్ అని వక్కాణించిరి.

ఇట్టిసర్వకళాపరిపూర్ణమును పవిత్రమునగుమనస్సే శ్రీభగవంతుని దివ్యమందిరముగానుండుటవల్ల నట్టిదివ్యస్థానమందే ప్రదక్షిణము చేయుటయే "కాబేషరీఫ్" యొక్క హాజ్.

ఇందులోని మరికొన్ని యతిరహస్యములను మహమ్మదియ మతస్థులు శ్రీగురుమూలకముగా గ్రహింతురు.

శ్రీభగవంతుని దివ్యమహాత్మ్యమును మిక్కిలి వినయముతో ప్రత్యహము స్తోత్రము జేయుచు మహాత్ములైన హాజరత్ సయ్యదినా

మహమ్మద్ గారికిన్ని, వారిసంతతి వారికిని వందనములు చేయుచు, నీచి

న్నపుస్తకము అనగా "బినాఇస్‌లాంకె పాంచ్ ఫరజ్"

అనుగ్రంథము శ్రీసృష్టికర్తయొక్క కృపాతిశయమువలన నిరంతరా

యముగా సమాప్తిఆయినందున నీపంచరత్నములను శ్రీస్వామివారి

దివ్యపాదపద్మములకును, మహాత్ములైన హజరత్ సయ్యదినా మహ

మ్మద్ గారికిని, వారిసంతతివారికిని, అర్పణజేయుచు, నీచిన్నపుస్తకము

ను పారాయణము జేయువారికిని, వినెడువారికిని, దీనినభివృద్ధిజేయు

టకు సహాయము చేయువారికిని, నెల్లప్పుడు నెడతెగని మేలు గలుగు

గాక. యని శ్రీభగవంతుని దివ్యసన్నిధియందు మనఃపూర్వకముగా

ప్రార్థించెదను. తథాస్తు.

సంపూర్ణము.



హకీం సయ్యద్ అబ్దుల్ ఖాదర్
కడప నవాబ్ గారైన నవాబ్ అబ్దుల్ మజీద్ ఖాన్ బ

హకీం సయ్యద్ కమాలుద్దీన్
కడప నవాబ్ గారైన నవాబు అబ్దుల్ హలీంఖాన్ బహ

హకీం మీర్ ఫజలే
అల్లీ సాహేబు
ఉత్తరఆర్కాట్ జిల్లాలోని
పుంగనూరు సంస్థానం
రాజా గారి సంస్థాన
వైద్యుడు.

హకీం సయ్యద్ అబ్దుల్ మజీద్ వురఫ్.
మంజూమియ్యాసాహేబు I.
తనపినతండ్రి కాలమైనపిదప పుంగ
నూరు సంస్థానం రాజా గారికి వై
ద్యుడుగా వుండినాడు.

సాహేబు,
[illegible]దూర్ గారి సంస్థానపు వైద్యుడు.

సాహేబు,
[illegible]దూర్ గారి సంస్థానపు వైద్యుడు.

హకీం సయ్యద్ ఖాజా
మియ్యాసాహేబు.
కడపజిల్లాలో స్వదేశవైద్యుడు.

హకీం సయ్యద్ హుసేన్ సాహేబు
వురఫ్ సయ్యద్ సాహేబు.
కడపజిల్లాలో స్వదేశవైద్యుడు.

హకీం సయ్యద్ అబ్దుల్ మజీద్, వురఫ్
మంజూమియ్యా సాహేబు II.
ఉద్యోగములైన తేదీలు.

16- 3-81.—ఆనరెరి మేజస్ట్రీట్.
15-10-82.—కడప మహమ్మదీయ సభకు కార్యదర్శి.
10-11-84.—మునిసిపల్ కవున్సిలర్.
9-10-85.—డిస్ట్రిక్టుబోర్డు మెంబర్.
14- 4-86.—తాలూకాబోర్డు మెంబర్.
26- 8-91.—ప్రైమరిస్కూలు పరీక్షబోర్డు మెంబర్.

1871 సంవత్సరం మొదలుగా అనుభవముకలిగిన
స్వదేశవైద్యుడు.

Khader Sahib,

*Bahadur, Nawab of Cuddapah.*

iddin Sahib,

*Bahadur, Nawab of Cuddapah.*

Hakim Sayed Khaja Meeyah Sahib, *Native Doctor in the Cuddapah District.*

Hakim Sayed Hussain Sahib alias Sayed Sahib, *Native Doctor in the Cuddapah District.*

Hakim Sayed Abdul Majeed, alias Munjoo Meeyah Sahib II.

DATES OF APPOINTMENTS.

16- 3-81.—*Honorary Magistrate.*
15-10-82.—*Secretary of Mahamedan Association, Cuddapah*
10-11-84.—*Municipal Councillor.*
9-10-85.—*District Board Member.*
14- 4-86.—*Taluk Board Member.*
26- 8-91.—*Primary School Examination Board Member.*
*Native practitioner working from* 1871.

